# పద్మవ్యూహం

(నాటిక)

రచన:

రమణారెడ్డి, వేణు.

విశాలాంధ్ర ప్రచురణాలయం,

విజయవాడ-2

# "పద్మవ్యూహం" గురించి
# మా మాట

ఈ కథ జరిగి ఉంటుందా అని సంశయింపవలసిన పనిలేదు. ఎక్కడో ఘటిల్లడమటుంచి, రచ్చకెక్కిందికూడ. బెంగాలులో ఒక జమీందారీ కుటుంబంలో చనిపోయిన మనిషి బ్రతకడం, సన్యాసుల్లో కలపడం, ఎస్టేటుకేసు నడపడం, ప్రీవీ కౌన్సిల్‌వరకు పోయి కేసు నెగ్గడం, విజయవార్త విన్న కొద్దిసేపట్లో గుండెఆగి చనిపోవడం జరిగింది. ఇటీవలనే న్యాయవాద వృత్తినుంచి విరమించిన డి. యన్. ప్రిట్ నెగ్గిన వ్యాజ్యాల్లో దీనికి ప్రముఖస్థానం వుందని పత్రికల్లో చదివాం. ఈ నాటిక వ్రాసినతర్వాత తెలియవచ్చింది అభీభట్టాచార్యవంటి నటవర్గంతో ఈ కథను "రత్నదీప్" అనే చలనచిత్రంగా రూపొందించారని. కాని అసలు ఘటనకుగాని, 'రత్నదీప్'కుగాని ఈ నాటిక భాష్యం చేయలేదు. అదృష్టవశాత్తు, ఆ చిత్రం చూడకముందే ఇది వ్రాయడం జరిగింది. చావుబ్రదుకుల చెట్టపట్టాలలో మనుష్యులు ఆటబొమ్మలుగా ఉపయోగపడుతున్నారనే విషయాన్ని మేమెక్కువ నొక్కి చెప్పామా? లేదు. ఆ పరిస్థితుల్లో ఒక వర్గంయొక్క వ్యర్థవాతావరణంలో ఆ యా పాత్రలు తమకు సహజంగా మాట్లాడే మాటలను మేము అణగద్రొక్కదలచుకోలేదు. అలా చేస్తే నాటకీయతను దెబ్బకొట్టినవాళ్ళ మౌతాము. ఈ విషయం దృష్టిలో వుంచుకొని, ఎవరైనా విమర్శలు చేస్తే తల ఒగ్గుతాము.

ముఖ్యంగా చెప్పదలచుకుంది, ఈ నాటికలో ఏ పాత్రకూడ ఏ వ్యక్తినీ మనస్సులో పెట్టుకొని వ్రాయలేదు. కాబట్టి ఇందుపై జరిగే ఏ వివాదాలకూ మా పూచీలేదు.

ఈ నాటిక వ్రాసేటప్పుడూ, వ్రాసిన తర్వాతకూడ అనేక సందర్భాలలో మార్పులు సూచించినవారిలో శ్రీ అయితా బలరామయ్యకు కృతజ్ఞత చెప్పుకోవడం మా విధి.

—రమణారెడ్డి, వేణు.



# పాత్రలు

1. దివాను : వయస్సు 45 సం॥ తలకు మడతటోపీ, ముఖాన తిరుచూర్ణం, కోటు, షరాయి, కట్ బూట్స్, వంకికర్ర.

2. కుమార్రాజా : వయస్సు 20 సం॥ కుచ్చుతలపాగా, లాంకోటు, షర్వా, బూట్స్.

3. ఖాసారంగయ్య : వయస్సు 45 సం॥ ఆహారం, ధోవతి, ఉత్తరీయం, తలపాగా.

4. రాధావినోదస్వామి: వయస్సు30 సం॥ మీగాళ్ళవరకు వదలైన సిల్కు లాల్చీ, సిల్కుదట్టీ, భుజాల మీదినుంచి వయటలాగా కప్పుకొన్న ఉత్తరీయం, మెడలో పూలమాల, చేతికి పూలదండ, ముఖాన తిలకం.

5. సాధు : వయస్సు 45 సం॥ కాషాయవస్త్రాలు, త్రిశూలం, కమండలం, మీసాలు, గడ్డం.

6. ఓంకారనాథస్వామి: వయస్సు 50 సం॥ కాషాయవస్త్రాలు, త్రిశూలం. జడలుకట్టిన తల, బారైనదాడీ

7. మోతీదేవి : వయస్సు 35, 40 మధ్య వెలగల దుస్తులు, కొద్దిపాటి ఆభరణాలు, ముఖాన కుంకుమ లేదు. హుందాగా ఉంటుంది; బర్మాముడి.

★

# పద్మవ్యూహం

## (నాటిక)

[జమీందారుగారి దేవిడీలో నడిమి హాలు. కుడివైపు ప్రవేశ ద్వారం. దానికి నేరుగా ఎడమవైపు కచేరీద్వారం. వెనక మధ్య రాణీవాసంద్వారం. దీనికి కర్టెను. దీనిపైమునుగా గోడకు పులితల. దాని కటూ ఇటూ దుప్పి తలలు. నడిమి ద్వారానికి అటూ ఇటూ చెరొక సోఫాసెట్టు. కుడి ఎడమ గోడలకు ఆనించి రెండేసి కుర్చీలు, ఒక టేబులు. నడిమిద్వారానికి కుడివైపు మేడమెట్లు].

ఉదయం తొమ్మిది గంటల సమయం.

(నేపథ్యంలో నౌబత్తుసంగీతం. తర్వాత...)

దివాన్ : (తెరలేస్తూనే కుడిచావిడి నుంచి ప్రవేశించి నిలిచి నడిమి వాకిలివైపు చూచి తన చేతి గడియారం చూచుకొని ఓపికలేనట్లు నటించి సోఫాలో కూచుని లేచి, మళ్ళీ కూచుని గడ్డంకింద చేయి పెట్టి మరోచేత్తో తన చేతికర్రను తిప్పుతూ వుంటాడు.)

ఖాసారంగయ్య. (నడిమి వాకిలిగుండా ప్రవేశించి దివానును చూచీ చూడనట్లు మేడమెట్లవైపు పోబోతుంటాడు.)

దివాన్: (తిప్పుతున్న చేతికర్రను చాచి రంగయ్యకు అడ్డంపెడుతాడు.)

రంగయ్య : (నిర్లక్ష్యంగా దాన్ని తొలగిస్తాడు.)

దివాన్ : చాలావరకూ వచ్చిందే ?

రంగయ్య : త్వరలోనే ముగుస్తుంది లెండి !

దివాన్ : (లేచి ఖాసారంగయ్య వద్దకు నడచి చేతి కర్రను అతని గుండెలకానించి) నూరేళ్ళు బ్రతకాల్సిన వాడివి కోరి మారిని పేరంటానికి పిలుస్తున్నావు.

రంగయ్య : పొద్దుపొడవకముందే మారి ఎదురైతే నేనేంచేయగలర?... దివానయ్యగారూ నేను ఖాసావాణ్ణి. తమ దారికి అడ్డురాలేదు. ఎందుకంత కంటుగించుకుంటారు నన్ను ?

దివాన్ : రాణివాసం మనదని గుర్తించుకోవడం మంచిదిరా, ఖాసావాడా !

రంగయ్య : చిత్తం ! ఏరలవారికి నేనో అడ్డా ? అయినా, పని బాటలవాణ్ణి, పగటిపూటైనా పోకుంటే తప్పుతుందా దివానయ్యా?

దివాన్ : మాటలు నేర్చావురా, మెచ్చాను. (కర్రతో దారిచూపి) జాగ్రత్త, మరి ఏడువ్ ! (రంగయ్య మేడమెట్లెక్కి పోతాడు) పట్టుకోందామనుకుంటే చేజిక్కని పాదరసం వెధవ ! (మోతీదేవి నడిమి ద్వారంగుండా ప్రవేశించి చూసి వెనక్కు పోబోగా) నీ కోసమే కాచుక్కూచున్నాను. చూసిగూడా, పోతున్నావే ?

మోతీదేవి : (వెనక్కుతిరిగి అయిష్టత కన్పరుస్తూ) జరూరు ఎస్టేట్ వ్యవహారాలేవైనా ఉన్నాయా ? లేకుంటే, పనివుంది. పోతాను.

దివాన్ : (చేతికర్ర తిప్పుతూ) చక్రం తిప్పేవాణ్ణి నేనుంటే, రుచీ పచీలేని రూ–అ–పై కబుర్లు నీ కెందుకు ?... సుఖాలుతిని, ఆనందాలు తాగి, గాలికాలితో పూలబాటమీద హాయిగా నడిచేదానివి?

మోతీదేవి : హాయి ? (నిట్టూరుస్తూ సోఫాలో కూర్చుని) అది ఈ జన్మకులేదు. ఇన్నాళ్ళూ హాయి అని దేని ననుకున్నానో అది పొడుబడిన పాపాలగోయి...... ఆత్మకంటె దేహమే శాశ్వతమనుకున్నాను. సత్తును చేబట్టి అపరంజిని కాలదన్నాను.

దివాన్ : (సానునయంగా) అరె ! పైనున్న స్వాములవారు వింటే ఏమంటారు ? ఇంత మారిపోయావేమిటి ?... సన్నటి వెన్నెల

ముసుగులో, గాలివింజామరలు వీస్తుంటే, పక్షులు సన్నాయి రాలుస్తుంటే, గడిపిన వెచ్చటిరాత్రులు మరిచావా ?

మోతీదేవి : దివాన్జీ ! (లేస్తుంది).

దివాన్ : (లేచి) నేను దివాన్నేనా ? మరేమిటి కానూ ? నీ తేనె చూపులకోసం నా ఆత్మను రక్తప్రవాహంలో స్నానం చేయించాను. నీ అధరపానం కోసం అన్నదాతను నరకాగ్నిలో తోసివేశాను. నన్ను పాపినిచేసి నువ్వు పుణ్యం మూటగట్టుకుంటావా, చెప్పు ! (ఖాసారంగయ్య గబగబ మేడమెట్లు దిగి నడిమిద్వారం గుండా నిష్క్రమిస్తాడు) నిన్ను నువ్వు బాధించుకొని అందర్నీ బాధించక కుంటే యేం ?

మోతీదేవి : నా ఆత్మవేసే సవాళ్ళకు నేను జవాబిచ్చుకోవాలి. నా పాపాలకు నేను పరిహారం చేసుకోవాలి. నేను బాగుపడతా నంటే మీకు బాధెందుకు ? కుమారబాబుకు వయసొచ్చింది. అతనికి పట్టంగట్టి నేను తప్పుకుంటాను.

దివాన్ : అప్పుడే ఏం తొందర ? తల నెరసిందా, నడుమూడిందా ? కుమారరాజావారు నేర్వవలసిం దెంతోవుంది. నేర్పవలసింది మనం. మరో ఐదేళ్ళతర్వాత పట్టంగట్టి నువ్వూ, నేనూ తీర్థయాత్రలు ...

మోతీదేవి : కాశీకిపోతూ పిల్లిని చంకలో పెట్టుకుపోయినట్టు నాలాంటి తెలివితక్కువది.

దివాన్ : (తెల్లబోయి) నాకర్థం కావడంలేదు మోతీ ! నేనే లేకుంటే క్షణం గడవని నీకు కాకుండా పశ్చాత్తాపమేమిటి ? ఈ శ్రమంతా నా కోసమేనా ?

మోతీదేవి: (కరుగ్గా) మరి, నాకోసమా? ఎల్లకాలం నీకు రంగసానినై ఆత్మద్రోహం చేసుకోలేను. దివాన్జీ, ఇకమీద ఎవరి హద్దుల్లో వారుండక తప్పదు.

దివాన్ : ఖాసారంగడు కొలువు చేరిననాటినుంచీ పువ్వువంటి దానివి పాషాణమై పోయావు. ఒరే ఖాసావాడా, నువ్వో, నేనో ?

మోతీదేవి : మీకింకా కొద్దిబుద్ధి పోలేదు. తప్పుచేసిన మనిషి స్వయంగా పశ్చాత్తాపపడగలడని, మసిబొగ్గు మాణిక్యం కాగలదని మీరు నమ్మలేరు. దోషికి లోకమంతా దోషిగా కనిపిస్తుంది.

దివాన్ : వాణ్ణి వెనకేసుకు వస్తున్నావే ?... (కర్ర గిర్రుని తిప్పుతూ) వ్యవహారం ముదిరింది ... (ఆలోచన నభినయించి) ఊఁ! ... (మోతీ నడిమిద్వారంగుండా నిష్క్రమిస్తుంది) సామోపాయం ఎదురు తిరిగింది. దానం, భేదం, దండం అవసరం! ... (పచార్లు చేస్తాడు).

రా.వి.స్వామి : (మేడమెట్లు దిగి హాలుమధ్యకువచ్చి కొనవ్రేళ్ళతో సుకుమారంగా జులపాల జుత్తు సవరించుకొని త్రేన్చి, ఉత్తరీయం పయటవలె సర్దుకుంటాడు.)

దివాన్ : (కర్రతిప్పడం మాని, భక్తితో అంజలిపట్టి) శ్రీమతే రామానుజాయనమః!

రా.వి.స్వామి : (సవిలాసంగా చేతులు బారచాపి కొద్దిగా వంగి చిరునవ్వుతో) అడియేన్ దాసోహం!

దివాన్ : నిత్యమంగళ విగ్రహులు లీలామానుషాకారులైన తమరు ప్రభువులేగాని దాసులా స్వామీ ?

రా.వి.స్వామి : (పెదవిమీద వ్రేలెట్టి) తప్పు తప్పు! (పైకి వ్రేలెత్తి చూపి) తానే ప్రభువులపైప్రభువు – స్వయంభువు. తానే నాధులపై నాధుడు–జగన్నాధుడు! పురుషుడున తానే–ప్రకృతియుం దానే! (పారవశ్యం నటిస్తాడు.)

దివాన్ : స్త్రీ, పుం భేదాలే తమకు లేవాస్వామీ ?

రా.వి.స్వామి : మానవులమందర మాడువారమే. పరమపురుషు డొక్కడే. ఆ డించిన నట్లాడువారమే. దేహము మోహామందిరము గావించి, ఇంద్రియ వ్యాపారముద్వారా ఆత్మకు త్తేజనము గల్పించి, తపించి తరింతము. భోగమే రాజయోగము.

దివాన్ : ఆహాహా! కలియుగానికి తగిన గీతోపదేశం చేయబట్టే గ్రామాలూ, నగరాలూ వచ్చి దర్శనం చేసుకుంటున్నై.

రా.వి.స్వామి : మా దర్శనం రేపని నిర్ణయించారట ? ఏర్పాట్లు ...

దివాన్ : భక్తబృందంకోసం స్వయంగా అన్నివసతులూ కల్పించాను. అమంగళం చూడ నొల్లరని గుడిసెలు పీకించాను. బీదాబిక్కీ అలబరిజనం మీ చాయలకే రాబోరు.

రా.వి.స్వామి : మంచిది మంచిది, దేవుడు కనులిచ్చింది కల్యాణం చూసేందుకేగాని వికారాన్ని చూసేందుకా? ... టముకు వేయించారా ?

దివాన్ : ఆలిండియా రేడియో ప్రకటన చేయించాను స్వామీ! వారపత్రికల్లో అంగుళం జాగాకు రెండు రూపాయల లెఖ్కన మూడుకాలముల పతాక శీర్షికతో వ్రాయించాను. షర్డీ సాయి బాబా, మెహర్‌బాబా తలదన్నే మహనీయులని వర్ణనలు చేయించాను.

రా, వి. స్వామి : (తృప్తిగా నవ్వి కళ్ళుమూసి శూన్యంనుండి ఏదో వస్తువును పట్టుకొన్నట్లు పిడికిలి బిగించి) మెచ్చాము–ఇచ్చాము! (దివాన్ చేతికస్తాడు)

దివాన్ : (చూచి) భస్మం!... (అసంతృప్తితో) ఈ నగరిలో తమకు పన్నీటి జలకాలు, పళ్ళు చిరుతిండ్లు, హంస తూలికాతల్పాలు, అగరు ధూపాలు, (స్వామి చెవి దగ్గర నోరుపెట్టి గుసగుసగా) కుమారరాజావారి సాహచర్యం కల్పించికూడా బూడిదేనా ?

రా. వి. స్వామి : (తెల్లబోయి చేసేదిలేక తన చేతి ఉంగరం తీసి ఇస్తూ) గంటలో ఒకసారి కంటే మహిమ పలకదు. నా ఉంగరం తీసుకోండి. బీజాక్షరం వ్రాయించి వున్నాను... నిజం చెప్ప మంటారా ? తానులేడూ... (సిగ్గుపడి) ఎవరూ ?

దివాన్ : అంటే శ్రీకృష్ణుడు.

రా. వి. స్వామి : (కులికి) యమునాతటిలో, బృందావనిలో రాస కేళిలో సొక్కించినందుకు మెచ్చి పూర్వజన్మలో ఈ అంగుళీ యకం ప్రసాదించాడు. ఇది ధరిస్తే, నా సవతిలేదూ... లక్ష్మి ...

మనకు గులామౌతుంది. ధనలక్ష్మీ, జయలక్ష్మీ, వశవర్తిను లౌతారు. (ఖాసా రంగయ్య నడిమివాకిలిగుండా చాటుగా చూస్తాడు.)

దివాన్ : కుమార్రాజాగారు నా మాట వింటారంటారా ?

రా. వి. స్వామి : దీని ప్రభావంవల్ల పాషాణం సెలయేరౌతుంది, ఉక్కు జావౌతుంది, వజ్రం పుష్పమౌతుంది. సరా ?... మరి ? (తలవంచి కాలిగోటితో నేలరాచి) మరి ? (ఖాసా రంగయ్య తల వెళ్ళబెట్టి చూస్తాడు)

దివాన్ : అదా ? మీ రడగాలా ? (జేబునుంచి నోట్లకట్టలు రెండు తీసి యిస్తూ) రెండువేలు! (చుట్టూచూసి) జాగర్త!... రాణీ సాహెబా చూస్తే నా నౌకరీ వూడుతుంది. సెలవా ?

రా. వి. స్వామి : కృష్ణార్పణమస్తు! (జేబులో పెట్టుకొని) పదండి, మీ కార్యం నా కార్యమే! (దివాన్ ఎడమ వాకిలిగుండా నిష్క్ర మిస్తాడు) సవర బంగారం ఖరీదు రెండువేల రూపాయలు! (నవ్వుకొని సోఫాలో కూర్చుంటాడు.)

కుమార్రాజా : (మేడమెట్లు దిగివచ్చి) నమస్తే స్వామీజీ!

రా. వి. స్వామి : (తప్పుచేస్తున్నావు సుమాఅన్నట్లు నోటికి వ్రేలడ్డం పెట్టి, తన పాదాలు చూపుకొని సాష్టాంగపడమన్నట్లు సౌంజ్ఞ చేస్తాడు.)

కుమార్రాజా . (అయిష్టంగా) కాళ్ళు ముట్టేవాడుకలేదు, క్షమించాలి.

రా. వి. స్వామి : (లేచి) మా పేరు తెలుసా?... రాధావినోదులు. మాకు సాష్టాంగపడితే తాను లేడూ తనకు పడ్డట్లే. అవమాసం ఘెందుకు ? భక్తిలో ఎంత లోతుకుదిగితే ముక్తిలో అంత ఎత్తుకు పోవచ్చు. కులం, ధనం, వంశం, అహం కల్పించిన మాయపొగలు తొలగించిచూస్తే ఏమి కనిపిస్తుంది ? ఈశ్వరుడు, నరుడు! ఒకడు ప్రభువు, ఒకడు కింకరుడు.

కుమా|రాజా : మీ రాసకేళీనిలయానికో పదీ, దినఖర్చులకో ఐదూ ఇప్పించాము కదా! ఇంత రొఖ్ఖం రాబట్టుకొన్నాకగూడ మీ కృష్ణుడు ప్రసన్నుడు కాడంటూరా?

రా. వి. స్వామి : (కోపంగా) తాను లంచగొండి మంత్రి వంటివాడనుకున్నావా? ... ... అల్పమనుష్యుడికే, వెధవ బస్‌రూట్ పర్మిట్‌కే లక్ష ఇస్తుంటే, దేవుడికి ఎంతిస్తే చాలుతుంది? తనువు–మనమూ–ధనమూ సమస్తమూ కృష్ణార్పణం చేసుకోవాలి.

కుమా|రాజా : మా ఎస్టేటుకేసు మీకు తెలిసిందేగద? ఇప్పటికే మూడు లక్షలు తగలేశాడు దివాను. వాడు దొంగచాటుగా ఎంత తింటున్నాడో?

రా. వి. స్వామి : (తన జేబు తడువుకొని తృప్తిగా) స్వామిభక్తిలో ఆంజనేయస్వామివంటివారిని శంకిస్తున్నావు. గోవర్ధనగిరి నెత్తిన బాలకృష్ణమూర్తివలె ఈ జమీభారమంతా తానొక్కడే మోస్తున్నాడు, పాపం!

కుమా|రాజా : (కోపంగా) మీరతన్ని సపోర్టు చేయడం మా కిష్టం లేదు... ఎప్పుడో వాణ్ణి హతం చేస్తాను. అడ్డునిలిచిన ప్రతివాణ్ణి పాతిపెడ్తాను.

రా. వి. స్వామి : (చెవులు మూసుకుని) హరి హరి! ప్రణయసుధా వాహిని కావలసిన లోకం ద్వేష రోషాలతో శ్మశానభూమి కావలసిందేనా? జాలీ, కరుణా, ప్రేమలనే చిగుళ్ళెత్తించి, మోడు బారిన హృదయ వృక్షానికి నవ వసంతం కల్పించడానికే, తాను లేడూ, తాను నా రూపం ధరించాడు.

కుమా|రాజా : దౌష్ట్యానికి దౌర్జన్యమే మందు.

రా. వి. స్వామి : (గుండెతడి నిలుపుకొని, కుమా|రాజా చేయి తన చేతిలోకి తీసికుని ఒత్తుతూ, ఎదురుగా దగ్గరగా నిలిచి అతని కళ్ళలోకి ప్రేమగా చూసి, అతని భుజాలు నిమిరి) మన్మథస్వామికి శరీరాలతో కైంకర్యంచేస్తేనే మోక్షపదవి చిక్కుతుంది. (మోకాళ్ల మీద వంగుతూ, కుమా|రాజా నడుమును చేతులతోచుట్టి, ఇంకా

వంగి తొడలమీదికి (వ్రేళ్ళను వదిలి) ఆహా... ఆహా... రక్తిలోనే ముక్తి! (నడిమివాకిలి వెనుకనుండి మోతీదేవీ, ఖాసా రంగయ్యా మార్చి మార్చి తలలు నిక్కబెట్టి రహస్యంగా చూస్తుంటారు).

కుమారరాజా: (జెర్రులు ప్రాకుతున్నంత అసహ్యంతో) ఛీ! ఛీ!... (రా. వి. స్వామిని నెట్టివేస్తాడు).

రా.వి.స్వామి: (లేచి) సైంసైం యనవలసిన అనుభవానందాన్ని ఛీత్కరిస్తున్నావు! వేడిలో తడిలో శరీరాలను కాగించి కరిగించి, మోహపుసుడిగాలిలో చిగురాకులా గిరగిర తిప్పించి, మధు స్వప్న వీధిలో విహారం చేయడమే జీవితానంద రహస్యం! ఔనను!... ఊఁ?... అనవేం?

కుమారరాజా: ధూత్! (మేడ మెట్లెక్కిపోతాడు. రా.వి. స్వామి కూడ అతన్ని అనుసరిస్తాడు.)

మోతీదేవి: (నడిమివాకిలిగుండా ఖాసా రంగయ్యతో ప్రవేశించి) వీడేంస్వామి రంగయ్యా?

ఖాసారంగయ్య: చెబితే నమ్మేరా? పూల చెండులా ఎవడు కంటికి తగిలితే, వాణ్ణి జెలగలా పట్టుకొని ఆవటీవాలూ కుంగ దీయడమే వీడి బతుకు. ఒళ్ళు తవుడుతూ జేబులు కత్తిరించడమే వీడి వృత్తి!

మోతీదేవి: డబ్బుపోతే పోయిందిగాని, కుమార బాబుగురించే నాకు భయంగా ఉంది.

ఖాసారంగయ్య: ఈ బొమ్మను త్రైతక్కలాడించే దెవరో మీ కింకా తెలీదనుకుంటాను... దివానయ్య...

మోతీదేవీ: (ఆశ్చర్యంగా) నమ్మ మంటావా, రంగయ్యా? ఇందు వల్ల అతనికేం లాభం రంగయ్య?

ఖాసారంగయ్య: బాబుగారు పెద్దై పెత్తనం చేతికి తీసుకుంటే, తన దొంగకూళ్ళు బంద్తై పోవా?... ఈ మొండిశిఖండి స్వామిద్వారా బాబుగారి మనసు మలుస్తున్నారు దివానయ్య... మూడోకంటికి

ఎరిక లేకుండా, ఖజానాలో నుంచి ఐదూ పదీ సిడికె ముట్టజెప్పు తున్నారు.

మోతీదేవి : నమ్మశక్యం కావడంలేదు.

ఖాసారంగయ్య : నా కంటికి చూపుతగ్గిందంటారా రాణీసాహెబా ?

మోతీదేవి : నువ్వే చూడావన్నమాట ! కుమారబాబు లోబడిపోతే నా రెండో కన్నుకూడ పోయినట్టే.

ఖాసారంగయ్య : వేరైవంగంది మానై వంగదు రాణీసాహెబా ? తమరు బాబుగారిని మందలించాలి—కాదు— హెచ్చరించాలి. మంద లించవలసినవాడు వేరే వున్నాడు.

మోతీదేవి : పిలుస్తున్నామని చెప్పిరా రంగయ్యా ! ముఖాన అడి గేస్తాను, పో.

ఖాసారంగయ్య : (ఎడమ వాకిలివైపు రెండడుగులువేసి నిలిచి) వెదక బోయిన తీగ తానే ఎదురునస్తోంది... వేరే పని చూసుకుంటాను రాణీసాహెబా !

మోతీదేవి : సరే! కాస్సేపట్లో కుమారబాబుని కిందికిపంపు. (ఖాసా రంగయ్య మేడ మెట్లెక్కిపోతాడు.)

దివాన్ : (ఎడమ వాకిలిగుండా ప్రవేశించి) నువ్వా మోతీ ? (కర్ర తిప్పుతుంటాడు.)

మోతీదేవి : (కరుగ్గా) నేనే ! కానీ యిది పడకగది కాదు. కొలువు కూటం ! మాటలు జాగ్రత్తగా రానీ !

దివాన్ : (కర్రతిప్పుతూ ఆపి తెల్లబోయి) ఓహో ? ... (సర్దుకొని చిరునవ్వుతో) క్షమించండి రాణీసాహెబా ! అంత సంకటపడు తున్నారేం? తమ సేవకు డుండగా ...

మోతీదేవి : భోగాలు ఎరగాచూపి దుఃఖాలు మేపే హితులుండగా మాకేం తక్కువ? ... (కరుగ్గా) దివాన్జీదివాణం ఎత్తుబడిపోతోంది.

దివాన్ : (హేళనగా) ఒళ్ళుగుల్లయినతర్వాత, స్త్రీబుద్ధి ఇంటిమీదికి మరలుతుంది కాబోలు ! కొత్త తెలివికదూ ?

మోతీదేవి : నీ గుట్టు రట్టౌతున్నది. కుమారబాబుని నుంచిచేసుకొని ఈ ఇంటి లక్ష్మిని చేరవేసికొనేందుకు మంచి జోడీ కలిపాను.

దివాన్ : ఖాసావాడిబుద్ధిని అరువుతెచ్చుకొని, జ్ఞానోదయంపొందావు: ధన్యవాదాలు ! నేను ముద్దిపగ్గైనానుకదూ ... ? వాడు కుసుమాస్త్రుడు. (కర్రతో నేలతాటించి) కుసుమాస్త్రుడు.

మోతీదేవి : ఛీ ! నౌకరుతో మాకు సంబంధం కలుపుతావా ?

దివాన్ : (నవ్వి) నేనూ తమ నౌకర్నేకద రాణీసాహెబా ? నాతో ఎవరు కలిపారు సంబంధం ?

మోతీదేవి : (నీళ్ళు నిండిన కళ్ళతో డగ్గుత్తికతో) రాజావారున్నప్పుడు కుక్కినపేనై వుండేవాడివి.

దివాన్ : (కర్ర బారుగాచాపి) వృద్ధనారివయ్యావుగా ? అంచేత పాతివ్రత్యం ఇప్పుడు అక్కరకు వస్తుంది. ఆ 'ప్రణయపక్షం నిష్కంటకం చేయవూ ?' అని శతపోరి, భర్తకు విషప్రయోగం చేయించావు. చచ్చిననాడే కళ్ళు చారడేసి.

మోతీదేవి : దొంగవలపులతో కళ్ళుకప్పి, దగాలతో మనసుతిప్పి, హత్యకు ఎగదోలింది నువ్వుకాదేం ?

దివాన్ : (నవ్వుతూ) అడ్డైన అభిమన్యుణ్ణి కూల్చివేశాను. అందుకే లోకం నన్నుచూసి భయం, గౌరవం చూపెడుతోంది. కాని పురుగుకూడా నువ్వు చులకన !

మోతీదేవి : నా పాపానికి అదే ప్రాయశ్చిత్తం ! కాని, నీ ఆటలు మరి సాగనీను. కుమారబాబునైనా దక్కించుకుంటాను.

దివాన్ : చూడమూ ? నే నిచ్చిన ఆటబొమ్మతో ఆడుకుంటూ కాలక్షేపం చేయనంటే నీ బాబు ఇంకో అభిమన్యుడైపోతాడు. (కర్ర గిర్రని తిప్పుతాడు).

మోతీదేవి : (బాధతో, భయంతో) ఆఁ ఆఁ ? ... (కసిగా) ఘాతుకుడా!

దివాన్ : అమృతాన్ని నీ అధరాలకందించిన చేతితోనే కాలకూట విషాన్ని అందిస్తాను. కామాగ్నిలో నిన్ను పొర్లించిన చేతితోనే

దావాగ్నిలో దొర్లిస్తాను... నా ప్రేమనైతే మరువగలిగావుకాని నా ద్వేషాన్ని జన్మాంతరాల్లోకూడ మరవలేవు! (కుడి నాకిలిగుండా నిష్క్రమిస్తాడు).

మోతీదేవి : (చేతులతో ముఖం కప్పుకొని వెక్కి వెక్కి ఏడుస్తూ కుర్చీలో కూర్చుంటుంది).

ఖాసా రంగయ్య : (మెట్లుదిగి చూచి సంకోచంతో గొంతు సవరించు కొని జాలిగా) రాణీసాహెబా ?

మోతీదేవి . (కన్నీళ్ళు దిగమింగి, ముఖం, కొద్దిగా చాయిచేసికొని కళ్ళొత్తుకొని తెచ్చిపెట్టుకున్న ఠీవితో కంపితస్వరంతో) ఏమన్నారు?

ఖాసా రంగయ్య : పచ్చిక గూడా భగ్గుమంటోంది రాణీసాహెబా ? కానీ గుట్లన్నీ విప్పిచెప్పి వస్తున్నా .. తమ రెందుకో ...

మోతీదేవి : (కోపంగా) ఏమిటిరంగయ్యా నువ్వనేది ? ... పోయి నీపని చూసుకో !

ఖాసారంగయ్య . బుద్ధి బుద్ధి ! ... కాని ఈ నౌకరు అక్కరకు రాకపోడు.

మోతీదేవి : (మెత్తబడి కంపిత స్వరంతో) ఏకాకినై పోయాను రంగయ్యా ! చుట్టూ ముప్పులు మోహరిస్తునై – నన్నెవ్వరూ రక్షించలేరు.

ఖాసారంగయ్య: తమరు సర్వాధికారులు...

మోతీదేవి : నే నాడదాన్ని, బుద్ధి తక్కువదాన్ని—నా బాబుకే ముప్పు తెచ్చుకున్నాను రంగయ్యా !

ఖాసారంగయ్య : దివానయ్య గురించి భయపడుతున్నారా రాణీ సాహెబా ?... తమ బాటలో మొలిచిన ముళ్ళమొక్కల నన్నిటినీ తవ్వి, బళ్ళ కెత్తించి తమ సెలవైతే ... (మోతీ కళ్ళెత్తి ప్రశ్నార్థకంగా చూస్తుంది) పల్లేరుగాయను గిల్లి వేస్తాను. .

మోతీదేవి : (భయంతో లేచి) చంపడమే !

ఖాసారంగయ్య : (చిరునవ్వుతో) తమరు సత్యకాలపు మనుషులు రాణీ సాహెబా ! కలికాలంలో దయాదాక్షిణ్యాలు దుర్గానికూడ చెయ్యవు. దినదిన గండంగా బతకడంకంటె ఒక్క వేటుతో అటో ఇటో తేల్చుకోడం మంచిదికాదంటారా లేదా ?

మోతీదేవి : ఊరుకో రంగయ్యా ! మొరటుపనులకు నేను మనిషిని కాదు.

ఖాసారంగయ్య : కత్తులూ కఠార్లూ ఎందుకు ? చిటికెడు విషం నోట్లో బెడితే నిండు జీవంకూడా ఠా మంటుంది.

మోతీదేవి : (ఒళ్లు జలదరించినట్లు సంచలించి కుర్చీపై కూలబడి హీనస్వరంతో) విషమే ? ... (ఆలోచనలోపడి) చితి రగుల్చక మునుపే ... గాలివానవచ్చి ... శవం లేచి కూర్చుంటేనో మళ్ళీ ?

ఖాసారంగయ్య : (ఆశ్చర్యంసూచిస్తూ) మళ్ళీ ? మళ్ళీ అంటున్నారేమిటి రాణీ సాహెబా ?

మోతీదేవి : (మళ్ళీ లోకంలోకివచ్చి లేచి దీర్ఘంగా నిశ్వసించి) నీకు చెప్పరానిదేముంటుంది రంగయ్యా? రాజాగారు విషప్రయోగం వల్లనే కాలం చేశారని వినేవుంటావు.

ఖాసారంగయ్య : విన్నానూ ! దానికీ దీనికీ పోలికేమిటి రాణీ సాహెబా ?

మోతీదేవి : కాష్ఠం రగిలించకమునుపే శవం మనిషిగా మారింది. గొంతెత్తి గోలపెట్టింది, చిమ్మ చీకటి. గాలివానా. ఎవరూ లేరు. మెరుపులు ఉరుములు ... ఆ దారినేపోతున్న సన్యాసుల తండాకు పొలికేకలు వినిపించాయి. వచ్చి కట్లు తెంచారు. రాజాగారువాళ్ళ వెంటే వెళ్ళిపోయారు. (మాట మాటకూ రంగయ్య ఆశ్చర్యం ఎక్కువౌతుంది)

ఖాసారంగయ్య : ఓరి దేవుడో ! ... అయినా, సరాసరి తమ ఇంటికి రాక, సన్యాసుల్లో ఎందుకు కలుస్తాడు రాణీ సాహెబా ?

మోతీదేవి : (విచారగర్భితంగా మందహాసంచేసి) నేనుండగా వారీ నగరిచాయలకైనా రారు. రంగయ్యా, రారు.

ఖాసారంగయ్య : మధ్య మీరేం చేశారని ?
మోతీదేవి : వెర్రివాడా ! కసాయివాడివద్దకు మేక స్వయంగా వస్తుందా (బాధతో) నా పసుపు కుంకుమలు తుడుచుకొంది ... నేనే!
ఖాసారంగయ్య : (చెవులు మూసుకొని బాధతో) ఇక చెప్పకండి రాణీ సాహెబా ! (మరోవైపుకు తలతిప్పి) పగటిపూట సూర్యుడిగా, రాత్రివేళ చంద్రుడుగా తమ ముఖాన్ని నమ్ముకొని లోకాన్ని మరచిపోయిన ఆ ధర్మరాజుని మీరే చంపారా ? ... అయితే బిడ్డను తల్లి చంపుకోవచ్చు.
మోతీదేవి : ప్రియమైన పువ్వులై చూసిన కళ్ళు, శత్రుని మంటలై చూశాయి. దివాన్ కోసం ...
ఖాసారంగయ్య : (కోపంగా) దివానా ?... వీడేనన్నమాట తని దేవత ?
మోతీదేవి : వాడు నా కోసమే వలవేశాడనుకుని మూర్ఖంగా నమ్మాను. (కుర్చీలో కూర్చుంటుంది.)
ఖాసారంగయ్య : ఆ స్త్రీకోసమని ఇప్పటికైనా గ్రహించారు. ఆడ దానికి విశ్వాసం లేకపోతే పోయెగానీ దూరపు చూపైనా లేదు. బురదను మెచ్చి పన్నీరు పారబోస్తుంది.
మోతీదేవి : నన్ను ఉదాహరణంచేసి ఆడజాతినంతా నిందిస్తున్నావా రంగయ్యా ?... నేను నిజంగా స్త్రీనా ?... కామారణ్యంలో గాండ్రించే బెబ్బులిని ...
ఖాసారంగయ్య : రాజాగారు తమకేలోపం చేశారని ? మాణిక్య మహల్లో విగ్రహంలా నిలిపి నిండు మనస్సుతో పూజచేశారనా ?
మోతీదేవి : అదే వారితప్పు. నాకు ప్రేమకావాలిగాని పూజెందుకు? ఆటబొమ్మగా చూసి తాము ముచ్చటపడ్డారు, కాని ఆడ జీవంగా నా ముచ్చట తీర్చలేదు. వెన్నెలవంటి వారి దయతో విసిగి, నిప్పులు చెరిగే ఎండకోసం తహతహలాడాను.
ఖాసారంగయ్య : కొట్టండి తిట్టండి, కాని తమరు శక్తిఅవతారం, రాణీసాహెబా ! సుఖమంటే తమ దృష్టిలో అమ్మవారి జాతర !

మోతీదేవి : (లేచి) కానీ నా అంతట నేను వారి ప్రాణాలను తీసే దాన్నా ?... రాజాగారి నిద్రలో నేనొక చిక్కటి జరీవెన్నెల నేతనైతే, దివాను నల్లటి కంబళిపోగు.

ఖాసారంగయ్య : దుష్టశక్తిని భూస్థాపితం చెయ్యకుంటే, అది కుమారబాబుగారిని కూడ గావడగవచ్చు.

మోతీదేవి : రాజాగారి స్మృతిచిహ్నంవంటి కుమారబాబును రక్షించు కోవాలి... తెల్లవారేసరికి ఈ నగరిముంగిట దివాన్ శవాన్ని చూడందే నేను నిద్రపోను. (కుర్చీలో కూర్చుని ఆలోచిస్తుంది.)

ఖాసారంగయ్య : అది నాకు వదలండి... మీ పగా నా పగా... (అని, పొరబాటు గమనించి సర్దుకొనేలోపల)

మోతీదేవి : (లేచి ఆశ్చర్యంగా) నీ పగేమిటి రంగయ్యా ?

ఖాసారంగయ్య : (సర్దుకుంటూ) తమ ఉప్పుతిన్న రుణానికీ, తమ పగ నా పగేకదూ రాణీసాహెబా ?

మోతీదేవి : భేషైన మాట ! (గొంతు తగ్గించి) రంగయ్యా ! చాల నాళ్ళనుంచి నాకొక తీరని ఆశవుంది. రాజాగారు నిజంగా బ్రతికే వున్నారేమో ?... ఆనందాశ్రమంలో నేనే రాజాగారి నంటున్న సన్యాసిని చూసి, వారో కాదో నిర్ధారణచేసుకోవాలి. పోయి పిల్చుకువస్తావా ?

ఖాసారంగయ్య : (తెల్లబోయి సర్దుకొని) సన్యాసులు మనకు ఎక స్పార్టిగద, రాణీసాహెబా. ఎస్టేటుకేసులో ముప్పుతిప్పలుపెట్టి లక్షలకు లక్షలు దుబారా చేయిస్తున్నారుకదా ! వాళ్ళతో ఎందుకు లావాదేవీలు ?

మోతీదేవి : ఆ సన్యాసే రాజాగారైవుంటే, ఎంత బాధపడుతున్నారో నని నాకు కష్టంగావుంది. ఆయన ఆస్తిని ఆయనకు యివ్వకుండా కోర్టు కెక్కించానేమోనని బాధగావుంది.

ఖాసారంగయ్య: వాడే రాజాగారైతే ఏం చెయ్యాలని మీ వుద్దేశం?

మోతీదేవి : ఏముంది? వారి ఆస్తినీ, బిడ్డనూ నారికే ఒక్కించి వేస్తాను. వారి పాదాలమీద నా తల పడవేసి, పాతాళంవరకూ కుంగదొక్కమని వేడుకుంటాను. (కుర్చీలో కూర్చుంటుంది).

ఖాసారంగయ్య : రాజాగారు అంత కఠినులుకాదేమో? మిన్నుల కెత్తిన మనిషే దుమ్ములో మొత్తుతాడా మీ తల?

మోతీదేవి : నీ దొడ్డమనసే అందరికీవుంటే, భూమి స్వర్గం అవుతుంది, పద రంగయ్యా! (పైకి చూచి) కుమారబాబు వస్తున్నట్టుంది. (రంగయ్య కుడివాకిలిగుండా నిష్క్రమిస్తాడు).

కుమా[రాజా : (మెట్లు దిగివచ్చి) రమ్మన్నారట? ఎందుకో?

మోతీదేవి : (లేచి) రమ్మన్నప్పుడేవస్తే రాచఠీవికి లోపంకాబోలు నేం? కుమారబాబూ, మీ ఆటలు మాకేం నచ్చడంలేదు. లోకంలో ఆడవాళ్ళు కరువైనట్టు, ఆ పేడివాడితో సరసాలాడుతున్నారు.

కుమా[రాజా : (వెకిలిగా) ఆడవాళ్ళు మీరున్నారుగా? ఆ సరసా లేవో మీతోనే ఆడమంటారా?

మోతీదేని : (నోరు నొక్కుకొని) అ... వ్వ...! మీకు మతిపోలేదు గద?

కుమా[రాజా : (వెకిలిగా) మతా? అసలు మాకు మతనేది ఒకటి వుంటేగద?... అహ, మీరిద్దరూ చేరి ఉండనిస్తేగద? ...... (కఠినంగా) అమ్మాజీ, చిననాటే ఆటపాటల్లో వేటవేడుకల్లో మా మనసు చొప్పించారు. ఎస్టేటు వ్యవహారాలనుంచి తప్పించారు. ఆడవాసన ఒంటికంతా పట్టించారు. ఎల్లకాలం నేను బుజ్జిబాబునై వుంటే, నా ఆటలు నాకూ, మీ ఆటలు మీకూ!

మోతీదేవి : (కోపంగా బాధతో) కన్నతల్లిననైనా లేకుండా ఎంత నూటిపోటి మాట లంటున్నారు! (గద్గద కంఠంతో) అనండి అనండి! కాలి కాలి క్రుంగిన మోడును కూలదోయండి. చెట్టు పోయినా కాయను చూచుకుని బ్రతుకుతున్నాను. ఇప్పుడు రెమ్మ వచ్చి కొమ్మను వెక్కిరించింది. ఇక అది వుండేం మండేం? (కుర్చీలో కూలబడి ముఖం చేతులతో కప్పుకుంటుంది).

కుమారరాజా : క్షమించండమ్మాజీ! (మోతీదేవి కూర్చున్న కుర్చీ వద్దకు పోయి పక్క కుర్చీలో కూర్చుని ఆమె చేయి నిమురుతాడు) ఏదో అనేశాను... క్షమించరూ?

మోతీదేవి : దోషినైన నన్నే మీరంతా క్షమించాలి, బాబూ!... మీరు బుద్ధిమంతు లయ్యారు, అదే చాలు. తండ్రంతటివారైతే చూసి పోతాను.

కుమారరాజా : మేము కళ్ళుమూసుకుని కూర్చోలేదు. అంతా గమనిస్తూనే వున్నాము.

మోతీదేవి : (లేచి) అదే బాబూ కావల్సింది.

కుమారరాజా : (లేచి) చెప్పవలసినదంతా రంగన్న చెప్పాడు. మా జాగ్రత్తలో మే ముంటాము, మీరు పదండి!

మోతీదేవి : రంగయ్య మనపాలిటి దేవుడు బాబూ! వస్తాను. (నడిమి వాకలిగుండా నిష్క్రమిస్తుంది).

కుమారరాజా : (మేడమెట్లువైపు పోతుంటే, పైనుండి ఒక కాగితం పడుతుంది. నిలిచి ఆశ్చర్యంతో నడిచి కాగితం మడతవిప్పి చదువ బూనుతాడు) "రాజగోపాలా! యశోదమ్మతో నీవింత జాగొన రించిన నేను మనగలనా? నా ప్రాణములు విరహాగ్నిలో వేగు చున్నవి. మేను సుఖమునకై తహతహలాడుచున్నది. ఓరి ధూర్త గోపకిశోరా, తాళజాల తాళజాలరా!"... (ఆలోచన నభినయించి చిరునవ్వుతో) ఓహో? నేను శ్రీకృష్ణుణ్ణైనట్టు, తాను గోపికైనట్టు స్వామీజీ ఈ ప్రణయలేఖ వ్రాశారు. (తల పైకెత్తి మెట్లువైపు తిరిగి) స్వామీజీ...స్వామీజీ!

రా.వి.స్వామి : (వయ్యారంగా కులుకుతూ మేడమెట్లు దిగివస్తాడు. తలకూ, ముంజేతులకూ పూలు చుట్టుకొని, ఉత్తరీయాన్ని పమిట వలె వేసికొనిఉన్నాడు. సరసాలాడుతున్న ప్రియురాలివలె గొంతు పెట్టి) ఏమి స్వామీ?

కుమారరాజా : స్వామి మీరే స్వామీజీ!

రా.వి.స్వామి : కాదు – నీవు!

కుమారరాజా : చాలుగాని రండి!

రా.వి.స్వామి : నేను రాను ... లోకంచూసి నవ్వేస్తుంది ... (కులుకుతూ తలవంచి కాలివ్రేలితో నేలరాస్తూ సిగ్గభినయిస్తూ శాలువా సర్దుకుంటాడు)

కుమారరాజా : సిగ్గుపడుతున్నారే! మగాళ్ళమధ్య సిగ్గెందుకు?

రా.వి.స్వామి : (అలుకనటించి) నీవు మగవాడివైతే అయ్యావుకాని నేను కాను.

కుమారరాజా : నా మగసిరినైనా నిలిపారంటే చాలు, పదివేలు.

రా. వి. స్వామి : తానే నీవు–నీవే తాను! ... నాథ నాథా జగన్నాథా! (పారవశ్యం అభినయించి, నాట్యభంగిమలో అడుగువేసి ముందుకు నడుస్తూ) రాసకేళిలో నిన్నలయించి, సొలయించనా? గోపీకృష్ణా! అహోహా! (కుమారరాజాను కౌగిలించుకుంటాడు)

కుమారరాజా : (వదలించుకుంటూ) విడవండి నన్ను! దయ్యం పూనిందా ఏమిటి?

రా. వి. స్వామి : ప్రేమపూనకము! ... నా దంతయు నీకిత్తును (వ్రేలి చివర పంటితో కొరకుతూ కులికి) మానధనమంతయు నిలువుదోపిడికి అర్పించుతును సరా? (కుమారరాజా చేయి తన కొన వ్రేళ్ళతో పట్టుకొని పైకి దారితీయబోతాడు)

కుమారరాజా : (విదిలించుకొని) మరి మర్యాదగా విడుస్తారా లేదా?

రా. వి. స్వామి : ఓ క్రూరదైవమా! నన్ను పరీక్షించుచున్నావా? ... సరేలే! (పోయి అలుకఅభినయిస్తూ సోఫాలో కూర్చుని చెక్కున చేయానిస్తాడు)

సాధు : (కుడివాకిలిగుండా ప్రవేశించి) జై కపాలమాలా! ... జై నిటాల జ్వాలా!

కుమారరాజా : (ఆశ్చర్యంగా విసుగ్గా) నువ్వెవరు? ఉన్న వేషాలతోటే చస్తుంటే ఈ పగటివేషమేమిటి? (రా. వి. స్వామి లేచి నిలుచుంటాడు)

సాధు : వీతరాగులం భసితాంగులం నాయనా! ఇంద్రియాలకు కళ్ళెం వేశాం, ఐహికాలకు గొళ్ళెం పెట్టాం!

ఖా. వి. స్వామి : అయితే మీకూ మాకూ చుక్కెదురు! వస్తాం! (మేడ మెట్లెక్కిపోతాడు)

కుమార్రాజా : సూటిగా చెప్పండి. ఎవరు మీరు ?

సాధు : (నవ్వి) మీ తల్లిగారి నడిగితే చెబుతారు.

కుమార్రాజా : ముయ్ నోరు! బయటికి నడువ్!

సాధు : బయటువుండవలసింది నువ్వు నాయనా! ఈ లోగిలంతా మాది!

కుమార్రాజా : ఆఁ ?... ఏమన్నావ్ ? (చేయి పైకెత్తుతాడు.)

మోతీదేవి : (నడిమి ద్వారంగుండా వచ్చి కుమార్రాజా చేతిని దించి) ఆగండి కుమారబాబూ... అతిధిమీద చేయిచేసుకోవచ్చా ? ... వీరిని నేనే పిలిపించాను.

కుమార్రాజా : వదిలండి నన్ను—ఇతని పైత్యం వదిలిస్తాను.

మోతీదేవి : తొందర పడకండి కుమారబాబూ! మీ తండ్రిగారిని లోకమంతా చాటుకుంటూ, ఈ ఎస్టేట్ తనదేనని వ్యాజ్యంనడుపుతున్నది... ఇతనే!

కుమార్రాజా : ఏమయ్యా బూడిదబుంగసన్యాసీ నీకు బుద్ధుందా అసలు ?

సాధు : (నవ్వి) కావలసినంతకంటె ఎక్కువే వుంది. నీ కేమైనా బదులియ్యమన్నావా చెప్పు, ఇస్తాను.

కుమార్రాజా : నోరు ముయ్.

సాధు : నీ నోరు నువ్వే మూసుకోలేవా ? నా సాయం ఎందుకు ?

మోతీదేవి : (ఆశ్చర్యంగా సాలోచనతో స్వగతంగా) అదే గొంతు! అదే చమత్కారం!...(సంతోషంగా విహ్వాలకంఠంతో) మీరేనా ?... నిజంగా మీరేనా ? (ముందుకు చేతులు చాచి నడచి వస్తుంటే.)

సాధు : నేను నేనే! నీవూ కాదు, అతడూ కాదు! (సోఫాలో కూర్చుంటాడు.)

కుమారరాజా : (ఠక్‌మని ఆగిపోయి వింతగా చూస్తున్న మోతీదేవిని పరికించి) ఏమిటమ్మాజీ ఈ తంతు ?

సాధు : అదే అడిగి తెలిసికుందామని మేమూ వచ్చాం ! (లేచి మోతీదేవితో కర్కశంగా) చచ్చి బ్రతికినవాణ్ణి తిన్నగా బ్రతకనీయక చంపివేద్దామని పిలిపించావు కదూ ? . . నీ గుండెలో విషం ఇంకా మిగిలేవుంది. ... ద్వేషమింకా రాజుకుంటూనే ఉంది ... కదూ ? ... ఏం, చెప్పవేం ? (పైకి పోతుంటే)

కుమారరాజా : (మధ్యకు వచ్చి నిలిచి) ఎవడివోయ్ నువ్వు. మర్యాద లేకుండా పైకి పోతున్నావే ! ఖబడ్దార్ !

మోతీదేవి : నువ్వెవరో లోకవంచకుడివి. కాని నన్ను మోసగించలేవు ! పదివేలసార్లు నేను వారిని చంపినా, నా మీదికి వస్తారా రాజావారు మిడసరంగా ? ... మరి, నువ్వు పోవచ్చు !

సాధు : (నవ్వి) అందిన ఆశాఫలాన్ని జారవిడుచుకుంటున్నావు సుమా !

కుమారరాజా : నీ దురాశాఫలం నువ్వే ఆరగించు ! పద బయటికి (సాధువైపు రెండడుగులు వేస్తాడు, సాధు కుడిగా నడుస్తాడు)

మోతీదేవి : (సంశయముతో సతమతమై) ఉండండి కుమారబాబూ ! (సాధుని తేరిపారజూచి) మీరు నిలవండి ! దయచేసి ఆగండి ! (సాధు వెనక్కి తిరిగిచూచి నిలుచుంటాడు)

కుమారరాజా : మీ ధోరణి నాకేం బోధపడటం లేదమ్మాజీ ! ఇప్పుడు ఎండ, ఇంతలో వానగా మారిపోతున్నారు.

సాధు : (నవ్వి) నువ్వునుట్టుకు అనుక్షణం మూర్ఖస్వర్గంలోనే ఉన్నావు.

మోతీదేవి : నేను పిడగొట్టిన రక్తశాఖ లేకమయ్యాయి. ... మిమ్మల్ని చంపుదామని పిలిపించలేదు. మీ చేతుల్లో చద్దామని పిలిపించాను ... ఇదుగో ఇతనే మీ బిడ్డ, ఇది మీ ఆస్తి ! నేను ... పాతకిని ... చంపెయ్యండి !

సాధు : (విశ్వసించి) చచ్చిబ్రతికివచ్చాను! ... (నవ్వి) నీకు బ్రతికి చావాలని ఉందా ? అయితే నీకోరిక తీరుస్తాను. కానీ నావలె తిరిగి బ్రతికిరాలేవు. గుర్తుంచుకో!

మోతీదేవి : నే నడిగేదీ అదే! ... మీ బిడ్డనూ, మీ ఆస్తినీ మీకు దక్కించాను — ఆ తృప్తితోనే చనిపోతాను.

సాధు : ఆస్తి ? కోర్టులో నేను నేనని నిర్ధారణకావాలిగా ? ... అయినా ఈ జమీ నీదీ నాదీ కాదు.

దివాన్ : (కుడిద్వారంగుండా పిస్టల్‌తో ప్రవేశించి) ఎవ్వరిదీ కాదు! (అందరూ నివ్వెరపోతారు. దివాన్ హాలుమధ్యకువచ్చి) నాది! (కుమార్రాజా మెల్లగా గోడప్రక్కనే నడిచి వెనుకనుంచి వస్తుంటాడు) ఖానాదంగిడి రాయబారం సజావుగా కొనసాగిందన్న మాట! ఊఁ! ... ఈ సహస్రాక్షుడినుండి ఏ గుట్టూ అట్టేకాలం దాచలేరు ... ఆ దరూ నా వ్యూహంలో చిక్కుపడిపోయారు. (కుమార్రాజా వెనకనుంచి వాటేసుకుంటాడు) మోసం! .. కుట్ర! (మోతీ, సాధూ నవ్వుతారు)

కుమార్రాజా : నువ్వు నా వ్యూహంలో చిక్కుబడ్డావ్! అభిమన్యుడు పద్మవ్యూహం ఛేదించాడు!

సాధు : (దివాన్ చేతినుండి పిస్టల్ లాగి విసరికొట్టి) భేషైన పని చేశావు బాబూ! పులిబిడ్డ!

దివాన్ : పులివి నువ్వేనా? పులివేషం వేసుకొచ్చిన గుంటనక్కవి!

మోతీదేవి : ఈ ముసలికుక్కని బందిఖానాలో తొక్కివెయ్యండి కుమారబాబూ! మలమల మాడిచావాలి!

దివాన్ : (నిస్సహాయంగా నీరసంగా నవ్వి) నా యవ్వనాన్ని నీ కారగింపు పెట్టాను జీవరక్తాన్ని నీ నరాల్లో జలపాతంగా ధారపోశాను. భర్త ప్రాణాలుతీసిన రాక్షసికి నే నొక లెక్కా ? (మోతీదేవి సాధువైపు చూస్తుంది.)

కుమార్రాజా : పదపదరా నడువ్! (వెనకనుంచి తోసికొని యెడమ ద్వారంగుండా నిష్క్రమిస్తాడు.)

సాధు : (దీర్ఘంగా నిశ్వసించి) గండం గడిచింది... మోతీ! (చేతులు చాపి మోతీదేవిని సమీపిస్తాడు) మోతీ !

మోతీదేవి : (అనుమానంతో) పేరెట్టి పిలిచే అధికారం ఎవరిచ్చారు మీకు ?...

సాధు : అగ్నిదేవుడు : వివాహానికి సాక్షి !

మోతీదేవి : దివానన్నట్లు మీరు పులివేషంవేసుకొచ్చిన నక్కయితే, రాజాగారి ధర్మపత్నినైన నేను ఒకసన్యాసికి బానిస కావలసిందేనా?

సాధు : నవ్వనా ? ఏడవనా ?

మోతీదేవి : పొంగి పొరలి !... మాంగల్యం పోయినా నాలో వివేకం నశించలేదు.

సాధు : శ్రీ శ్రీ రాణీసాహెబావారూ ! మీరు పరమ నిర్భాగ్యులు ! ఏమంటూరా, వినండి భర్తనేకాక, ప్రియుణ్ణీ దూరంచేసుకున్నారు. (నవ్వుతాడు)

మోతీదేవి : (కోపంగా) రాజాగారే నా అవస్థ చూచివుంటే, ఓదార్పుతో గుండెగాయం మాన్చేవారు. వ్యంగ్యాలతో నువ్వు కొత్త గాయాలు చేస్తున్నావు. నువ్వు రాజాగారి కాలిదుమ్ముకయ్యాడా పోలవు.

సాధు : (నవ్వి) ఆదర్శాన్ని పూజించుకుంటూ వాస్తవాన్ని నమ్మలేని మూర్ఖురాలివి నువ్వు ! సరే, పోతున్నాను. (నిష్క్రమిస్తాడు)

మోతీదేవి : (దిగ్భ్రమతోనిలుచుని, ఇంతలో కలతతేరి చుట్టూచూచి పడివున్న పిస్టలునుతీసి టేబుల్ డ్రాయర్లో దాచి, నడిమి ద్వారం గుండా నిష్క్రమిస్తుంది.)

కుమారరాజా : (ఎడమద్వారం గుండా ప్రవేశించి) పులి బోనులో పడింది ! (కుర్చీలో కూర్చుని ఆలోచిస్తాడు.)

రా.వి.స్వామి : (మేడమెట్లు దిగివచ్చి) కుమారబాబూ ! ఎవ్వరూలేరు కద ?

కుమారరాజా : (లేచి) గోపీ పూనకం దిగిపోయిందా స్వామీజీ ?

రా.వి.స్వామి : అది పూనకంకాదు, రససమాధి ! మైమరపు! ఈ భ్రమే శాశ్వతమైతే బ్రహ్మానందపదవి వేరే ఎందుకు ?

కుమారరాజా : ఉనికే ఒక కల – మనికే కళ ! కదూ స్వామిజీ ?

రా.వి.స్వామి : (తృప్తిగా) మా ఆంతర్యం తెలిసినవాడివి నువ్వొక్కడివే.

కుమారరాజా : ధన్యోస్మి !

రా.వి.స్వామి : నీ మాటలు వింటే కిలకిల కలకూజితాలు వినిపిస్తాయి. నీ రూపుకంటె నవనవలాడే చివురు జొంపం కనిపిస్తుంది మరి నిన్ను తాకితే ... (పారవశ్యం అభినయిస్తూ) ఓహోహో ! మంచుకు తడిసిన పారిజాతం పూలు తలకు బోసుకున్నట్లుంటుంది.

కుమారరాజా : నిజమేనా స్వామీజీ ?

రా.వి.స్వామి : నిజమా? ఏం మాట! బాలికనై నీతో చేయిచేయి కలిపి (కుమారరాజా చేతివ్రేళ్ళలో తనవి చొనిపి ఎగురవేస్తూ) సయ్యాటలాడివుందును. యువతినై (కుమారరాజా ఛాతీని తాకి) ఈ వక్షోపీఠంమీద తలాన్చి నిదురించి వుందును. (వంగి కుమారరాజా తొడలు నిమురుతూ) ఈ మండే ఇనుప కంబాలమీదుగా భువిని దివితో సంధించి వుందును. అహః !

కుమారరాజా : ఆనందం చాలా ?

రా.వి.స్వామి : చాలా? అదేంమాట! ఒత్తుగా మెత్తగా మత్తుకలిగిస్తూ మై సోలిస్తూ ఉంది.

కుమారరాజా : (వంగి స్వామి చెంప చెడీల్మనిపించి) ఇప్పుడో స్వామీజీ ?

రా.వి.స్వామి : (నీళ్ళు నిండిన కళ్ళతో లేచి ) యెంత కర్కశం నీ హృదయం ?

కుమారరాజా : (ఇంకో చెంపవాయించి) హృదయంకాదు హస్తం ! (రెండుచెంపలు వాయించి) బద్మాష్ !

రా.వి.స్వామి : ఆఁ ? ఆఁ ? మేము నీకు హాయి నిస్తే . .

కుమార్రాజా : మేము గూబ గుయ్యి మనిపించాము. రాస్కెల్! దివానుగాడితో లాలూచీపడి ఈ ఎస్టేటు దిగమింగా లనుకున్నావేం? సాతిపెట్టిస్తాను!

రా. వి. స్వామి . జగన్నాథా! జగన్నాథా! (రెండు చేతులెత్తి ప్రార్ధనా పూర్వకంగా పైకి చూసి) చావు బ్రతుకుల్లో వున్న నీ దాసుణ్ణి కాపాడే భారం నీదే!

కుమార్రాజా : దేవుడి పేరుతో దేవిడీలు దోచుకునే దొంగవి! (అడుగుముందు కేసి) ఇంద్రియానందానికి నెల్లవేసి బ్రహ్మానంద మని బూకరించే టక్కరిసి!

రా. వి. స్వామి : (తప్పించుకో జూస్తూ విలుకాక) ఆపద్బాంధవా అనాథ రక్షకా, పాహిపాహి! (కుడిద్వారంవైపు ఎగిరి గంతేస్తాడు)

ఖాసారంగయ్య : (కుడిద్వారంగుండా స్వామికి అడ్డుగా ప్రవేశించి) అంజనేయులూ లోపలికిపద! కుప్పిగంతులు వేస్తే పడి తల బొప్పి కడుతుంది.

రా. వి. స్వామి : అగ్నికి వాయువు తోడైంది. రెండు మంటలనడుమ చిక్కిన లేడినయ్యాను. హతోస్మి హతోస్మి!

ఖాసారంగయ్య : కుమారబాబూ, ఈ మాయ లేడీ అసలు కీలకం అంతుచిక్కించుకువచ్చాను.

కుమార్రాజా : నిజంగా? ఎవడేం వీడు?

రా. వి. స్వామి : "లా వొక్కింతయులేదు, ధైర్యము విలోలం బయ్యె, ప్రాణంబులున్ రావుల్ దప్పెను... ..." (వారిద్దరినీ చూస్తాడు)

ఖాసారంగయ్య : చాల పెద్ద కథలెండి! హరికథల్లో ... (రా. వి. స్వామి కూలబడుతాడు) రాటుదేరిన రకం!

కుమార్రాజా : హరి భీట్!

రా. వి. స్వామి : (మోకాటిపై మోచేయి అన్చి, అరచేతిలో తల పెట్టుకొని) "మూర్ఛవచ్చె, తనువున్ దస్సెన్, శ్రమంబయ్యెడిన్" ...

ఖాసారంగయ్య : పైగా నాటకల్లో ఆడవేషాలు వేసేవాడు. విప్ర వినోదులవద్ద కనికట్టు విద్యలు నేర్చాడు. అవే మహిమలంటూ లోకాన్ని బూకరిస్తున్నాడు.

కుమార్రాజా : ఓరి వీణ్ణి తగలెయ్య! (పైకిపోయి రెండు గుద్దులు గుద్దుతాడు) పదిహేనువేలు కాజేశాడు!

రా.వి.స్వామి : (విహ్వాలంగా గొంతెత్తి) చచ్చాన్రోయ్ చచ్చాన్రోయ్! ఓరి దేవుడో, నేనేం జేతునురో! యములవాళ్ళ పాలైతినిగదరో నేనేం జేతునమ్మో? (ఖాసారంగయ్య, కుమార్రాజా నవ్వుతారు.)

ఖాసారంగయ్య : అడనడత నరనరాన దూరిపోయింది బాబూ! అగ్గే వీడికి అక్కరకు వచ్చింది. దివానయ్య చదరంగంలో వీడు బంటు!

కుమార్రాజా : మంత్రిపని తీరిందిలే, రంగన్నా! ఇక ఈ బంటుపని బట్టాలి.

ఖాసారంగయ్య : ఆ ఉక్కిష్టుడిదగ్గరికి ఈ గోపెమ్మను పంపుదాం!

కుమార్రాజా : లేవరా పున్నతేలూ, లేచి నడుక్! (ఖాసారంగయ్య లేవనెత్తితే లేచి, రా.వి. స్వామి. అతనిముందు ఎడమ ద్వారం గుండా నిష్క్రమిస్తాడు. కుమార్రాజా తృప్తిగా మేడమెట్లెక్కి నిష్క్రమిస్తాడు.)

ఓంకార్‌నాథ్ : (కుడి ద్వారంగుండా ప్రవేశించి చుట్టూ చూసి) శ్మశాన రాజ్యం!... (త్రిశూలదండం నేల దట్టించి) జై కపాల మాలా!...ఎవరూ పలకరేం?...(మళ్ళీ దట్టించి) జై నిటాల జ్వాలా!...హుః!

ఖాసా రంగయ్య : (ఎడమవాకిలిగుండా ప్రవేశించి) మీరా గురూ?... ఢిల్లీనుంచి ఎప్పుడు దయచేశారు?

ఓంకారనాథ్ : ఇప్పుడే!

ఖాసా రంగయ్య : సెలవైతే రాత్రికి నేనే తమ దర్శనం చేసుకోనూ?... పైవారు వింటే ...

ఓంకారనాథ్ : నా కేం భయం ?

ఖాసా రంగయ్య : నా నౌకరీబ్రతుకు కడముట్టుతుంది... సయ చెయ్యండి గురూ, రాత్రికి వస్తాను.

ఓంకారనాథ్ : వీల్లేదు ! సమయం ఆసన్నమైంది. ఐసల్ పైసల్ తేల్చుకోవాలి.

ఖాసా రంగయ్య : అంత తొందరేం వచ్చింది ?

ఓంకారనాథ్ : వ్యవహారం సొంతం కాబోతోంది.

ఖాసారంగయ్య : ఎప్పుడు, ఎప్పుడు ?...

ఓంకారనాథ్ : నీ వ్యామోహం పెరిగిపోతోంది సుమా ! జాగ్రత్త !

ఖాసా రంగయ్య : (సర్దుకొని భక్తి నటిస్తూ) కోప్పడకండి గురూ !

ఓంకారనాథ్ : దొంగ వినయాలతో కడుపు నిండదు... మోసం చేయదలచుకున్నావా, నేను మంచివాణ్ణికాదు, తెలుసుగదూ ?

ఖాసారంగయ్య : తెలియకేం ?...కానీ నా మాట నమ్మండి !... తిరిపెమెత్తి బ్రతుకుతున్నాను. నెత్తిమీదకూర్చుని గద్దిస్తే నే నేం చెయ్యగల ?

ఓంకారనాథ్ : పోతే తిరిగిరాని సంపదను నీకిచ్చాం. పోగొట్టుకున్న పరువు కల్పిద్దామని మా రక్తం ధనంగా మార్చి ఖర్చుచేశాం.

ఖాసారంగయ్య : ఒక చేత్తో మొట్టిన సర్వేశ్వరుడే రెండో చేత్తో లాలించాడు. ప్రత్యేకించి మీ రేదైనా సాయపడివుంటే దాన్ని మరవను – ఖరార్ !

ఓంకారనాథ్ : (జేబునుంచి కాగితం ఒక్క విదిలింపుతో తీసి చూపుతూ) అయితే ! ఇదిచూడు ! నీ వ్యవహారం ఫైసలైంది. నువ్వు గౌరవయ్యావు, కానీ, తీర్చుకో రుణం !

ఖాసారంగయ్య : (కాగితం అందుకొని వణికే చేతులతోపట్టి చదువుకొని బిగ్గరగా) న్యాయం గెలిచింది ! న్యా...యం... గె...లి... చిం...ది !

ఓంకారనాథ్ : (తీవ్రంగా చూస్తూ) జంకుతున్నావేం ?

ఖాసారంగయ్య : (తొట్రుపడుతూ) ... ఇంకెందుకు ?... (లేనినవ్వు తెచ్చిపెట్టుకొని) మీరు ... మీరు ... చాలా సాయంచేశారు ... కృతజ్ఞుణ్ణి ...

ఓంకారనాథ్ : నీళ్ళు నములుతున్నావు. నాకు తెలుసు, నీలో విద్రోహం తలెత్తుతోంది. దాన్ని కప్పి నన్ను మభ్యపెట్టడానికి తంటాలు పడుతున్నావు ... (జేబులోనుంచి మరో కాగితంతీసి విదిలించి) కానీయ్, సంతకంచెయ్.

ఖాసారంగయ్య : ఏం సంతకం ?... ఎందుకు ?... ఏమిటీ పత్రం ?

ఓంకారనాథ్ : ఏమిటా ? నీ స్థిరచరాస్తులుయావత్తూ ఆనందాశ్రమానికి దఖలుచేస్తున్నట్లు పత్రం వ్రాయించితెచ్చాను. మరి, నీ నాన్నబడు బేరంసాగదు.

ఖాసారంగయ్య : అన్యాయం !... (నిస్సహాయంగా) అన్యాయం !

ఓంకారనాథ్ : ఏది న్యాయం ?... చావు నోటినుంచి ఈడ్చివేసి, ప్రాణంపోసి, ఐదేళ్ళపాటు తిండీ గుడ్డా ఇచ్చి, జిల్లాకోర్టు మొదలు సుప్రీంకోర్టువరకు వ్యవహారం నడిపించి, వేలు వెచ్చించినవాణ్ణి నన్ను మోసంచేయబూనడం న్యాయమంటావా ?... న్యాయమట న్యాయం !

ఖాసారంగయ్య : క్షమించండి !... నా వంశానికి అన్యాయం చెయ్యలేను ... మీరుచేసిన ఖర్చులన్నీ భరిస్తాను. పైగా, కృతజ్ఞతా సూచకంగా, ఆశ్రమానికి నాలుగులక్షలిస్తాను.

ఓంకారనాథ్ : బిచ్చంవేస్తావా మాకు ?... మే మెవరమో తెలిసీ కూడా మొరాయిస్తున్నావే ? ఫలితం తెలుసుగదూ ?

ఖాసారంగయ్య : తల గిల్లేవేస్తారా ? కానీండి !

ఓంకారనాథ్ : సరిగాచెప్పావ్. శక్తికి రక్తాభిషేకం చేసి, శవ నైవేద్యం ఇస్తాను.

ఖాసారంగయ్య : (నవ్వి) ఇప్పుడు నేను — కాస్సేపట్లో మీరు — ఇద్దరం యముడింటి విందుకు పోయేవాళ్ళమే. బ్రతకడానికే భయపడాలి గాని చావుకు భయమెందుకు ?

ఓంకారనాథ్ : చావుకు భయం లేదూ ?... లేదూ? చావు కౌగిలినించి జారి బ్రతుకుబరిలో దూకి పడినప్పుడు... శ్మశానంలో... చిమ్మ చీకట్లో .. గాలీ వానా లంకించు కొన్న సమయంలో... నక్కల కేకలకు వెరచి... నర సహవాసంకోసం గొంతెత్తి అరచినప్పుడు.. ఏమైంది ఈ ధైర్యం ?... మేమే లేకుంటే నక్కలకడుపు నిండేది.

బాసొరంగయ్య : నక్కలు మాంసంమట్టుకే తింటాయి. కాని మీలాంటి మనుషులు మనస్సును కూడ పెరికి తింటారు.

మోతీదేవి : (నడిమి ద్వారంగుండా ప్రవేశించి ఇద్దర్నీ ఎగదిగ చూసి, ఆశ్చర్యంతో) చాలసేపటినుంచి మీ మాటలు వింటున్నాను ... (ఓంకార నాథ్‌తో) ఎవరునువ్వు ?

ఓంకారనాథ్ : (వికటంగా నవ్వి) కనిపించడంలేదూ ?... ఎందుకు కనిపిస్తుందిలే? ... సేవకుడికీ, భర్తకూ భేదం తెలియని కబోదివి...

మోతీదేవి : (సంభ్రమాశ్చర్యాలతో) రంగయ్యా !...

ఓంకారనాథ్ : (వికటంగా నవ్వుతాడు) రంగయ్య !... రంగయ్య !...

మోతీదేవి : (రంగయ్యతో) రంగయ్యా !.. నువ్వురంగయ్యవి కావూ? నువ్వు... నిజంగా ?... నామతి పోతోంది... మీరు ... (మూర్ఛ పడబోతే రంగయ్య వచ్చి అదుకుంటాడు.)

ఖాసొరంగయ్య : మోతీ !... మోతీ !... నేనే...

మోతీదేవి : (తేరుకొని) ఎంత అన్యాయంచేశాను ! మీరెంత అన్యాయం చేశారు ! నౌకరుగా నటిస్తూ మా చెప్పుచేతలలో మసలతూ మీపగ సాధించుకుంటారా ?... (ఓంకారనాథ్‌ను చూసి) ఎవరితను ?

ఓంకారనాథ్ : మృత్యుదూతను ! ... (రంగయ్యతో) చివరిమాట, ఏమంటావు ?

ఖాసొరంగయ్య : రక్తసంబంధం తెంచుకోలేను. అయినవారికి వట్టి చెయి చూపి బయటివారికి నా సర్వస్వం ధారపోసేంత దొడ్డతనం నాలో లేదు.

మోతీదేవి : సన్యాసికి ఆస్తి ఎందుకు ?

ఖాసారంగయ్య : యోగులనీ నిస్సంగులనీ నటిస్తూ, నెత్తుటికూళ్ళు గుడిచే రక్కసి బలగానికి మొనగాడివై, భయపెట్టి అమాట రాబట్టుకున్నావు.

ఓంకారనాథ్ : (ఉగ్రుడై) నా ప్రాణంమీదికే తెస్తావట్రా ? (చేతిలోని శూలంమొన రంగయ్యడొక్కలో దిగబడేటట్లు పొడిచి కుడి ద్వారంవైపు గబగబా నడుస్తూ) నీకు తెలిసిన రహస్యం నీతోనే భూస్థాపితం కావాలి !

ఖాసారంగయ్య : (ఒక చేత్తో డొక్క పట్టుకొని తూలుతూ సోఫా మీద వ్రాలుతూ) అబ్బ... అబ్బ... మోతీ... మోతీ...

మోతీదేవి : [టేబుల్ డ్రాయరువద్దకు పోతూ ఓంకారనాథ్‌తో] ఆగు...[పిస్టల్ తీస్తుంది. కాని ఓంకారనాథ్ నిష్క్రమిస్తాడు. మోతీదేవి పిస్టల్‌ను తిరిగి దాస్తుంది.]

మోతీదేవి : (గద్గదికతో, రంగయ్యను సోఫామీద వ్రాలబెడుతూ) రక్తం... రక్తం... అయ్యో... మాట్లాడకండి... డాక్టరు...

ఖాసారంగయ్య : లాభంలేదు మోతీ ! . ఇక బ్రతకను ... మానవుడు తలచేదొకటీ, విధాయకం ఇంకొకటీ ... ఇష్ .. అబ్బ !

మోతీదేవి : మెరుపులా మెరిసి ఇంతలో వెలిసిపోయింది భాగ్యరేఖ !

ఖాసారంగయ్య : విధి గుడ్డిది, ప్రాణం ఇచ్చినట్టే ఇచ్చి దోచివేసింది. అబ్బ ... అబ్బ !

మోతీదేవి : డాక్టరును పిలిపిస్తాను ... ఈసారి నన్ను విడిచిపోరు... పోనీయను ... (లేస్తుంది)

దివాన్ : (ఎడమద్వారంగుండా చేత బాకుతో ప్రవేశించి) నువ్వు పోనిచ్చేదేమిటి ... తల్లో మెదడూ, చేత బాకూవుంటే, యముడు కూడా గుల్లామై సలాముచేసి దారిస్తాడు ... (సోఫావైపు చూసి) ఓహో, ఖాసావాణ్ణి సింహాసనమెక్కించి, ప్రణయసామ్రాజ్యం స్థాపించుకున్నావే ? ... ప్రళయం సృష్టిస్తాను ... ఇప్పుడేంచేస్తారు ?

ఖాసారంగయ్య : (కష్టంమీద లేవబోయి కూర్చుని) చేతిలో పిడిబాకుంటే గడ్డిపోచకూడ నాగై చెరకొడుతుంది. అదిలేకుంటే భీముడుకూడ బెంబేలెత్తుతాడు! ఆయుధం గొప్పగాని, నీగొప్పేముంది? ... అబ్బ... అబ్బ! ... [వ్రాలబడుతాడు.]

దివాన్ : (రంగయ్య అవస్థచూసి నవ్వి) రక్తం మడుగులో తేలుతూ కూడా తత్వం పలుకుతున్నావే?... బ్రతుకులో ఓటుబడిని పుట్టి గరచిన బలహీనులు, చావు నోటిక చిరుదిండిగా మారిన దౌర్భాగ్యులు మాట్లాడే మాట లేం లాభం? ఒరే ఖాసాంసాహేబా, నీ కోసం తెచ్చిన బాకు పనికిరానందుకు చింతగావుందిగా! ... కాగల కార్యం గంధర్వులే తీర్చారు!

మోతీదేవి : ఎవడు ఖాసా? ఒళ్ళు దగ్గరబెట్టుకొని మాట్లాడు... వాడు శ్రీ శ్రీ...

దివాన్ : (గ్రహించి వికటంగా నవ్వి) ఎంతమంచి కబురు?... వారు శ్రీ శ్రీ రాజావారా? చచ్చి బ్రతికినవాడు బ్రతకపోయి చస్తున్నాడన్నమాట!... (నవ్వి) శ్రీ శ్రీ రాణీసాహెబావారూ!... వైధవ్యం తమ జన్మహక్కు!... మగడికి మారుమగడికి చెడ్డారు... ప్చ్‌ప్చ్‌ప్చ్ పాపం!

ఖాసారంగయ్య : అబ్బ!... మోతీ!... వాణ్ణి... చిత్రవధ... (మోతీదేవి నెమ్మదిగా టేబులువద్దకు నడుస్తుంది)

దివాన్ : (నవ్వి) యమలోకానికి తోడుకావాలా?... ఇదిగో ఈకోటినే తీసుకొని పోదువు, తమాయించు!... (బాకు మొన మోతీకి చూపుతూ ముందుకు నడుస్తూ) విత్తొకటీ చెట్టొకటీ కాదు... నువ్వు పండించిన విషపు పంట నూర్చుకునే ఘడియవచ్చింది!... (చేయెత్తుతాడు)

మోతీదేవి : ఛావు–కుక్కా! (డ్రాయరు లోపల దాచిన పిస్టల్ తీసి పేలుస్తుంది)

దివాన్ : (తూలిపడుతూ) అ... మ్మా...! (చనిపోతాడు)

కుమార్రాజా : (గబగబ మేడమెట్లు దిగివచ్చి) ఏమిటమ్మాజీ? ప్రేలుడు! దివాన్ ... రంగన్న ... ఏమిటమ్మాజీ? ... రక్తం ... !

మోతీదేవి : [బిగ్గరగా నవ్వి] దేవిడీ ... పీనుగుల చావిడి ... [నవ్వుతుంది]

కుమార్రాజా : అమ్మాజీ ... అమ్మాజీ! ... రంగన్న ... రంగన్నా ...

మోతీదేవి : [నవ్వి] రంగన్న .. ఓరి వెర్రినాగమ్మా, దేవుడు ఎంత మోసగాడ్రా? ... కనిపించినట్టే కనిపించి మాయమైనాడు ... అటు చూడబ్బాయ్, ఆ పెద్దమనిషి ఎంత దయలేనివాడో చూడు! తానేమో చావులేని సీమకు తరలి పోతూ నన్ను చావు బందీగా చేసి పోతున్నాడు! ... నేను సరే విషమిచ్చాననుకో, నువ్వేంచేశావబ్బాయ్! ... మీ బాబుగారున్నారే ... (ఏడుస్తూ కూలిపోతుంది)

కుమార్రాజా : (రంగయ్య వద్దకు ఉరుకుతూ) మా బాబుగారేరీ? ... (రంగయ్య మీద వ్రాలి) ... బాబూ ... బాబూ!

ఖాసారంగయ్య : (లేవబోయి పడి, నాయనా! ... చావుతో పందెం వేసి ఓడిపోయాను ...

మోతీదేవి : (పిచ్చిగా నవ్వి) పందెం నాతో వేస్తావుటే? ... చావుకు నేనంటేభయం ... పుణ్యానికి నామీద పగ! ...

రా.వి.స్వామి : (ఎడమ వాకిలిగుండా ప్రవేశించి నక్కినక్కి వంగి కూర్చుని నడుస్తూ భయంతో) వీరాంజనేయం ... ప్రసన్నాంజనేయం ... ప్రభామూర్తి కాయం ... వీరాంజనేయం ... ప్రసన్నాంజనేయం ... (కుడిద్వారం సమీపించగానే ఎగిరిగంతేసి) బ్రతికానోయ్! [నిష్క్రమిస్తాడు.]

ఖాసారంగయ్య : నాయనా ... మీ అమ్మాజి ... పాపం ... మతిచలించింది ... జాగ్రత్త ...

కుమార్రాజా : అందరూ నాకు దూరమౌతున్నారు ... ఈ పద్మవ్యూహంలో నేనుచిక్కుబడిపోయాను! ... అమ్మాజీ! ... బాబూ! ...

మోతీదేవి : పద్మవ్యూహమట పద్మవ్యూహం! [నవ్వి] ఎవడికివాడే ఒక వ్యూహంపన్నాడు... తానే జగదేక వీరుణ్ణనుకున్నాడు ...

ఈశ్వరుడి పద్మవ్యూహంముందు మనుషులవన్నీ తునాతుంటలై పోయాయి... ఆకాశా న్నందుకోబోయిన మనిసి పాతాళాన కూలిపోయాడు... వెర్రిసాయన! (నవ్వుతుంది)

ఎస్.ఐ.: (సంకెళ్ళుతొడిగిన ఓంకారనాథ్‌తో కుడిద్వారం గుండా ప్రవేశించి) అరె! వాటీజ్ దిస్! డబుల్ మర్డర్!...

ఖాసారంగయ్య. (సోఫామీదినుండి లేవబోయి) పట్టుకున్నారా?

ఎస్.ఐ.: ఇన్ఫర్మేషన్ యిచ్చినందుకు థ్యాంక్స్ రంగన్నా!

కుమార్రాజా: వారు శ్రీ శ్రీ రాజాగారు! రంగన్న కాదు.

ఎస్.ఐ.: (ఆశ్చర్యంగా) వాట్! వండర్ఫుల్! సింప్లీ థ్రిల్లింగ్! (రంగన్నవద్దకుపోయి చూచి] అరె! డయ్యింగ్! పిటీ!...

ఖాసారంగయ్య: ఎక్స్క్యూజ్ మీ, ఇన్స్పెక్టర్! వాడే నన్ను పొడిచి పోయ్యాడు.

ఎస్. ఐ.: (ఓంకారనాథ్‌తో) యూ? రాస్కెల్! (చెంపలు వాయించి) రాబరీసే కాకుండా మర్డర్స్‌కూడా చేస్తావన్నమాట! [కుమార్రాజాతో దివాన్ శవాన్నిచూపి] మరి ఈ జంటిల్‌మన్ని మర్డర్ చేసిందెవరు? [కుమార్రాజా తికమకపడతాడు]

మోతీదేవి: పరమేశ్వరుడు లేడూ? వాడు!... బొమ్మలు చెయ్యడం పగల మొత్తడం తప్ప వేరే పనిలేదు వాడికి! (నవ్వుతుంది) టుంటరి పిల్లాడు!

ఖాసారంగయ్య: ఇన్స్పెక్టర్! వాణ్ణి కాల్చింది నేను!... అదిగో పిస్టల్! అదే రుజువు [కూలబడిపోతాడు] అబ్బ... మోతీ... బాబూ... [చనిపోతాడు]

కుమార్రాజా: (రంగయ్యవద్దకుపోయి, చేయి పట్టిచూసి) బాబూ... బాబూ... అయిపోయిందమ్మాజీ, అయిపోయింది!

మోతీదేవి : (కుడిద్వారంగుండా పోబోతుంటే కుమార్రాజా నడిమి ద్వారంగుండా లోపలికి పంపిస్తాడు) బయట వెలుతురు, లోపల చీకటి!... ఇల్లు వల్లకాడు, వల్లకాడు ఇల్లు! (నవ్వుకుంటూ లోపలికి నిష్క్రమిస్తూ) బ్రతుకు చావు— చావే నిజమైనబ్రదుకు!

కుమార్రాజా : (గాఢంగా నిశ్వసించి) నిజం! బ్రతకడంకంటె చావడమే గొప్ప!

ఎస్. ఐ. : (కుమార్రాజా భుజంతట్టి) మనస్సు చిక్కబట్టుకోండి లేకుంటే, ఈ ఇల్లు పిచ్చాసుపత్రి అవుతుంది!... స్టేషనుకెళ్ళి జమాన్లను పంపుతాను. ఈ లోగా శవాలు జాగ్రత్త! (ఓంకార నాథ్‌తో) నడవరా నడుప్! (కుడిద్వారంగుండా నిష్క్రమిస్తారు).

కుమార్రాజా : (హాలుమధ్యలో నిలిచి స్వగతంగా) బ్రతుకనేది ఒక చిక్కుప్రశ్న. దానికిజవాబు చావేనా?... చావనే నదిలో జారుడు దీవిగడ్డేనా బ్రతుకు?

—[ తెర ]—

